# పొలం గట్టు

ప్రేమ, పౌరుషం మహోత్కృష్టంగా తన జీవితమందు గడపి దివికేగిన తల్లి సౌభాగ్యమ్మకు అంకితము.



ఆర్యా,

సాహిత్యలోకానికి నాటకరంగానికి మొదటి ప్రయత్నం.

పల్లెలు ప్రశాంతంగా నడిచే ప్రదేశాలు. జీవితం శాంతంగా ఉండేచోటులు. కాని నేటి పరిస్థితులలో అవికూడా విశ్రాంతి లేకుండా ప్రతి చిన్నవిషయానికి పోట్లాటకు దిగి కోర్టుకు ఎక్కడం, ఆ కోర్టులో కొన్ని వందలవేల రూపాయలు ఖర్చుచేయడం, కొన్ని సంవత్సరాలపాటు విరివి విరామం లేకుండా కోర్టుకు తిరగడం, వ్యసనపడుతూ జీవితాన్ని ధారపోసి దుఃఖభాజములగుచున్నవి.

విద్యాధికులైన దంపతులు ఈ విషమ పరిస్థితుల నెదురుకొని పల్లెజీవితంకోసం జరిపిన పోరాటం ఏ విధంగా కొనసాగుతుందో చదవండి.

రచయిత :

**విడియాల నాగేశ్వరలింగం.**

## పాత్రలు :

**రంగారావు:**—పెద్దకాపు. స్థితిపరుడు. మొండిపట్టువాడు. (Villain) విమలతండ్రి.

**రాఘవుడు:**—సామాన్యుడు. (సామాన్య స్వభావంకలవాడు.) పెద్దకాపు స్థితిపరుడు. బాబుతండ్రి.

**బాబు:**—విద్యావంతుడు. పల్లెసేవాపరాయణుడు (Hero).

**విమల:**—విద్యావతి. పల్లెజీవితం, దేశంకోసం సేవచేసే పుణ్యవతి. (Heroine.)

**బీదవాడు:**—జీవితకష్టపరంపరలు అనుభవించిన వ్యక్తి. గర్భదరిద్రుడు.

**ప్లీడరు:**—ధనాశాపరుడు.

రైతులు, గొల్లలు, రైతుపిల్లలు, కూలివాండ్లు, జీతగాడు, కలెక్టరు, మునసబు, Revenue Inspector యింకా కొందరు.

[ఈ నాటకాన్ని ఇంగ్లీషుభాషలో మనోరంజకముగా తర్జుమా చేసిన యువకునకు పాతికరూపాయలు బహుమానం.]

# పొలం గట్టు



## రైతులు, కూలీలు : పాట.

ఎందరు రాజు లేలాలో
ఎందరు కళ్లా పట్టాలో
ఒకొంకొంకందు లెంపూ బాబూ లెంపూ లెంపూ !

పరాజయం పరాజయం
పరాభయం పరాభయం
ప్రబలిందండీ బాబూ ప్రబలిందండీ బాబూ !

కవిపుంగవులా గన్నా దేశము
భక్తశేఖరుల గన్నా దేశము
బంగరు కంతల గానము జేసె
భారత దేశం భారత దేశం ॥ఎందరు॥

ముస్లిం హిందూ తగాదాలలో
చతికిలబడ్డా క్షేత్రాలన్ని
అలాగే నిక్కిసిలిగి ఉన్నాయి బాబూ
అలాగే నిక్కిసిలిగున్నాయి బాబూ !

ప్రఖ్యాతొందిన పల్నాటివీరుల
కీర్తిశాలురగు రాజవరేణ్యుల
ముక్తిజెందినా త్యాగమూర్తులా గన్నా దేశము
సడలిందీబాబూ ఖదీలల్లో సడలిందీ ! సడలిందీ !

కూలీనాలి రైతుకష్టల
బీదసాదల దేశదరిద్రా తొలగంగా
లెండూ బాబూ లెండూ లెండూ!

ఆంధ్రుల కీర్తుల నిలబెట్టంగ
రక్తనాళములు ఉడుకెత్తంగ
వీరరౌద్రములు విస్ఫారంగా
లెండూ బాబూ లెండూ లెండూ!

[ఎద్దులు నాగలిని లాక్కుపోతూవుంటవి. రైతుజనం కూలీలు పొలం సామగ్రిని భుజములమీద వేసుకొని పాటపాడుకుంటూ పొలాల్లోకి వెళ్తారు. రాఘవుడు, రంగారావు ఇద్దరు ఆ పల్లె పెద్దకాపులు. రంగారావు రాఘవుని పొలంగట్టు తెగకొట్టమని తన కూలీలను ఆజ్ఞచేస్తాడు? రంగారావు కూలీలు రాఘవుని పొలంగట్టు తెగకొట్టుతారు. రాఘవుడు అక్కడకు వస్తాడు.]

రాఘవుడు:—రంగా! హోలీపండుగలో జరిగిన అవమానం చాలక, మరల పోట్లాటకు వేరే ఎత్తు వేస్తున్నావే. ఆ గట్టు తెగకొట్టితే మురుగునీళ్లన్నీ నా పొలంలోకి రావురా?

రంగారావు:—అవును. అది నా గట్టు. నాయిష్టం. నీ వెవరవు నన్నడగటానికి. నా గట్టును తెగకొట్టుకుంటానో లేక మానుతానో. అదంతా నీకెందుకూ?

రాఘు:—అవును. నీగట్టా! గట్టుకాదు. నీ గౌరవం తెగకొట్టుకుంటున్నావు. హోలీపండుగ విజయవంతంకాకుండా విషాదాంతానికి నీవుకాదు కారణం? పల్లెంతా నవ్వింది. ఆ రోజులు మఱచిపోయావు.

రంగా:—ఛీ! ఆట్టివాక్కు. అది నా గట్టు. నాయిష్టమొచ్చినట్టు నేను నడుస్తాను. నీ వెవరవు నన్నడగటానికి.

+ రాఘు:—క్రిందటి కొలతలకు కదుటోయి Revenue Inspector గారు హద్దువేసి, ఈ గట్టు నా పొలంలోది, దానిమీద నాకు సర్వ

హక్కులు ఉంటాయని చెప్పివెళ్లింది నీ ముందేగా! ఆమాట మఱచిపోయావు.

[రంగారావు పాలిషోక చూస్తూ ఉంటాడు.]

సుబ్బడు:—(రంగారావు నియమించిన కూలి, రాఘువుని వంకచూచి) యేమండి బాబయ్యా! క్షమించాలి. రంగారావుగారు మమ్మల్ని గట్టు తెగకొట్టమన్నారు. మాకేమి వచ్చి పడుతుందో బాబు. బీదవాళ్లం. పెద్దకుటుంబంమాది. నిజం చెప్పాలంటే మాకు యీ విషయం ఏమీ తెలియదు. బాబయ్యా! పెద్దలు మీరు, మీకాళ్లు పట్టుకుంటాను. (రంగారావు వంకచూచి) గట్టు తెగకొట్టించడానికి మీకు ధైర్యం ఎలా వచ్చిందండీ? (స్వగతంగా) మా ప్రాణాల్ని కోర్టుకు ఎందుకు ఊరిపోస్తారు. బీదవాళ్లమైనా మాకుండే గౌరవం, మానమర్యాదలు మాకున్నవి. మమ్ములను కోర్టుకు యీడ్వకండి బాబు. పెద్ద ఆసాములు, మీకు వేయిదండాలు బాబయ్యా!

రెండవకూలి:—సుబ్బడూ! మనకేం భయంరా? మొన్న కలెక్టరుగారికి మనబాబు రంగారావుగారు ఏంచేసారో తెలుసునా?

సుబ్బడు:—ఏం చేసార్రా! వెధవా? ముండనేమైనా కుదిర్చార్రా?

రెండవ:—అబ్బే! అదికాదు. ఆరుడబ్బాల నెయ్యి ఒకబండి గడ్డి పంపించార్రా. అది వారికి ధైర్యం. పెద్దదొర ఉండగా Revenue Inspector ఏమి చేస్తాడురా? ఎందుకలా అధైర్యపడతావు? (రంగారావు వంకచూచి) అన్నీ ఆలోచించే చేస్తారు మన పెద్దోరూ. మనకెందుకు భయం

రాఘు:—అదా విషయం. సరే కోర్టులో కాని పరిష్కరింపబడదన్న మాట. రంగా! మర్యాదగా మసలుతుంటే వేరుకు మేకులవు

తున్నావ్. బాగా ఆలోచించుకో. నీ పలుకుబడి కోర్టులో కాని తేలదు. లంచానికి ఆశపడి ధర్మము, న్యాయము, సత్యము, లేకుండా తీర్మానం చెప్తాడా యేమి ఆ పెద్దదొర కలెక్టరుగారు! చూడాలి. (వెంకు వంకచూసి రాఘవుడు నిర్ణయించినకూలి) అరేయి వెంకూ ఆ గట్టును పూడ్వరా. నీ వేమి చేస్తావో చూద్దాం. సాగరుబోతు వట్టి వెధవలాగున్నావు.

రంగా:—ఏమిటిరా ప్రేలుతున్నావు.

[ఒక దెబ్బ రాఘవుని చెంపమీద వేస్తాడు. రాఘవుడు కూలివాని చేతిలో కొడవలి తీసుకొని పైకెత్తుతాడు. వెంటనే రాఘవుని అన్నయ్య బాబు ప్రవేశిస్తాడు. కొడవలిని దించి.]

బాబు:—నాన్నా, రంగారావుగారు ఎందుకండీ మీరిలా పోట్లాడు తారు.

సుబ్బడు:—రంగారావుగారు గట్టు తెగకొట్టారని. మురుగంతా మీ పొలంలోకి వచ్చి పడుతుందని మీ నాన్న పోట్లాడుతున్నాడు. ఇది విషయం.

బాబు:—సరే. ఈ విషయాన్ని గురించి Revenue Inspector గారికి చెప్పుదాం. పోట్లాటెందుకూ? నేను వెళ్లి Inspector గారిని పిలుచుకొని వస్తాను. ఆయనే పరిష్కరిస్తాడు. మన మెందుకు కొట్లాడుకోవాలి కోర్టు ఉండగా. వాళ్లే విషయాన్నంతా చర్చించి ప్లీడర్ల, Inspector ల సాక్షిసమాధానాలమీద తీర్మానం చెప్తారు. మనలో మనకు ఎప్పుడు కలియక ఉండరాగదా! మనమంతా సఖ్యతగా ఉండి మన సమస్యలను మనమే సర్దుబాటు చేసుకుంటూ ఉంటే మనకా కోర్టు కూడ అక్కరలేదు. కాని యేమి చేయడం? రంగా గారు మనమాట వినరయ్యో. పద్దలం మనం. పల్లెనంతా

నడిపేవాళ్లం మనం. మనమే పోట్లాడుకుంటూవుంటే. Government నిర్ణయించిన కోర్టుకు వెళ్లడం తప్పదు. పోని కోర్టుకు వెళ్లకపోయామా వాళ్లే వచ్చి మనలను తీసుకొని వెళ్లుతారు. అప్పుడు మనజీవితమంతా ఆ కోర్టుకే ధార పోయాలి. మన పలుకుబడి, మన గౌరవం, మన మర్యాదలు ఆరోజుతోనే అడుగంటుతవి. తప్పుడు సాక్ష్యాలు చెప్పాల్సొస్తుంది. ఆత్మ గౌరవముపోయి. మనస్సును చంపుకోవలసివస్తుంది. వృథాగా పల్లెనంతా కోర్టుకు యీడ్వాల్సొస్తుంది. డబ్బుకు డబ్బు శ్రమకు శ్రమకలిగి న్యాయానికి ఎదురుచూస్తూవుంటే వచ్చే జవాబు! డబ్బు పెట్టి, ప్లీడర్ల చుట్టూ తిరిగి అష్టకష్టాలు పడితే వచ్చేఫలితం భగవంతుడికి తెలియాలి! పోని న్యాయమో అన్యాయమో తక్షణమే తేలుతుందంటే అది జరుగదూ! సంవత్సరాలపాటు కోర్టు చుట్టూ తిరుగవలసిందే. (రంగారావు వంకచూచి) రంగారావుగారు చిన్నవాణ్ని తెలిసో తెలియకో చెప్పుతున్నాను. నామాట వినండి. రైతులకష్టా లధికమవుతవి. మనం మన పల్లెజీవితం దుఃఖంలో కుంగిపోతుంది. ఆగట్టు తెగకొట్టితే మీకొచ్చిన లాభమేమిటండీ?

రంగా:—ఛీ! కుర్రకుంకా. నివ్వుకూడా నీతులు చెప్పొచ్చావ్ నోరుమూయి.

రాఘు:—(కోపంతో కొడవలినెత్తుతాడు. బాబు అడ్డం వచ్చి)

బాబు:—వారిమాటలు నాకేమి అగౌరవము కలిగించవులేనాన్న. విషయాన్ని చక్కగా పరిష్కరించాలంటే ఇలాంటి అవాంతరాలే ఎదుర్కోవాల్సి ఉంటుంది. కొడవలి ఎత్తితే పరిస్థితి యింకా విషమిస్తుంది. మన విరోధం అధికమవుతుంది. పల్లె అధోగతి పాలవుతుంది. (వెంకు వంక తిరిగి) వెంకూ దాని ప్రక్కనే మన పొలంలోకి ఇంకోగట్టు వేయరా. మురుగు

రావడం ఆగిపోతుంది. Revenue Inspector గారు ఊళ్లో ఉన్నట్టున్నారు. నేను వెళ్లి వారిని తీసుకొనివస్తాను. నాన్న వెళ్దాం పా.

(తండ్రి కొడుకు లిద్దరు నిష్క్రమిస్తారు.)

[కూలీలు పాటపాడుతూ పనిచేస్తూవుంటారు. రంగడు పొలంవంక చూస్తూ కూలీల డబ్బు లెక్క వేస్తూవుంటాడు. సుబ్బణ్ని పిలచి]

రంగా:—వీళ్లందరికి కూలి ఎంతరా?

సుబ్బడు:—మూడు రూపాయలండీ.

[బాబు, Revenue Inspector ప్రవేశిస్తారు.]

Revenue Inspector:—(గట్టువంకచూచి) రంగారావుగారు నామాట వినండి. ముందుగా ఆలోచనచేసి ఏమైనా చేయండి పల్లెకంతా పెద్దలు, శిష్టులు, గౌరవనీయులు, అధికార బలంకూడా సంపాదించారు. మిమ్ములను కలెక్టరుగారువారి క్రిందనున్న గుమస్తాలు గొప్పగా పొగుడుతున్నారు. ఆ గౌరవం దక్కించుకోండి. ఆధారంలేని ఈ చిన్న విషయం లో కోర్టుకెక్కడం చాలా అగౌరవము. చూసేవాళ్లకు, వినేవాళ్ళకు అసహ్యంగా ఉంటుంది. ఆగట్టు పూడ్పించండి. దానిమీద మీకేమి అధికారం లేదు.

రంగా:—మీసంజాయిషీ నాకేమి అక్కరలేదు. కలెక్టరుగారే వచ్చి తీర్మానం జేస్తారు.

R.I.:—సరే. ఈ కేసును గురించి కలెక్టరుగారికి వ్రాస్తాను. వారు వచ్చి స్వయంగా పరిష్కరిస్తారు.

[బాబు, Revenue Inspector నిష్క్రమిస్తారు.]

(తెర వాలును).

## 2-వ రంగం.

[అదొక పెద్ద మఱ్ఱివృక్షము. దాని కొమ్మలు నలుదిశలు ప్రాకిఉంటాయి దాని ఊడలు భూమిలోకి చొచ్చుకొనిపోయి వుంటాయి. ఆప్రదేశము గొల్ల పిల్లలకు ఆటపట్టు. దానిప్రక్కనే ఎండలోవేసిన పిడకలు ఉంటాయి.

విమల రంగారావుని ముద్దులకూతురు. విద్యావతి. పిడకలను గంపలో వేసుకొని, పాటపాడుకుంటూ ఇంటికి వస్తూవుంటుంది. బాబు కూనిరాగాలు తీస్తూ అక్కడకు వస్తాడు. విమలను చూచి]

బాబు:—విమలా! ఏమి అలా అలసివస్తున్నావు. ఆ గంపలో వేమిటి?

విమల:—పిడకలు చావిట్లో పోద్దామని తీసుకొని వెళ్లుతున్నాను.

బాబు:—అమ్మా దొంగా పిడకలా, ప్రియుణ్ని గంపలో పెట్టుకొని వెళ్లుతున్నావులే. నాకు తెలుసు. అబద్ధాంగాడకు.

విమల:—ఓహో, బాగుంది! నీ కవిత్వం, ఓహో, ఓహో (recurring) మరీ బాగుంది నీ చమత్కారం. [illegible]న్నావు. ప్రియుడు కాకపోతే.

బాబు:—అయితే.

విమల:—నీవు ఆ గంపలో ఉన్నావన్నమాట.

బాబు:—నేను నమ్మను.

విమల:—నమ్మవూ. ఇదో చూడు (అని గంప దభాలున నెత్తిమీద నుంచి దించుతుంది) నువ్వేనా.

బాబు:—(గంపనుచూసి) పిడకలా, సరేలే. చెంపలేసుకుంటాను. చాలా పెద్దపని పెట్టుకొన్నావే. కొండకురావన్నమాట.

విమల:—అవును. చాలా పిడకలున్నాయి. ప్రొద్దెక్కుతుంది.

బాబు:—విద్యావతివైనా పిడకలెత్తడం మానలేదు. నిగర్వీణి అంటే నిన్నుచెప్పాలి విమలా.

విమల:—పోనిద్దూ.

బాబు:—పోనీ నేను సాయంచేయనా.

విమల:—మా నాన్న ఊరుకోడుగా.

బాబు:—మీ నాన్నకు నేనేమి పరాయివాణ్ణా? నీకు నచ్చితే చాలు. మీనాన్న, మీఅమ్మకు నేను ముద్దుగానే ఉంటాను. ఇదో ఇటు చూడు. (ఠీవిగా నిలబడి) నేను బాగున్నానా. అందంగా లేనూ?

విమల:—అందంగా లేకేం అచ్చ కృష్ణుని బొమ్మలాగున్నారు.

(ఇద్దరు నవ్వుతారు.)

[బాబు కొంతదూరంలో కూర్చొని పిల్లనగ్రోవిని నేలకు కొట్టుతూవుంటాడు. విమల అతనికి చేరువులో కూర్చొని ఉంటుంది.]

బాబు:—విమలా నేనొకమాట చెప్పుతాను. వింటావా.

విమల:—ఏమిటి.

బాబు:—వింటానంటే చెప్తా?

విమల:—ఊ!!!

బాబు:—ఏమిలేదు. నీవు రేపుక కొండకు రావాలి. చాలా గొప్ప సంగతులున్నాయి. చెప్పాలనివుంది. వస్తావా?

విమల:—అవును. మొన్న ఆ కథ అంతటితోనే ఆపివేసావు. చివరకేమైంది.

బాబు:—ఏమైందా? విషాదాంతంగా మారింది. ప్రియుడు అక్కడకువచ్చాడు. ప్రేమించిన స్త్రీ మత్తుమందు త్రాగి అలా పడివుంది. అతనికి తెలియదు పాపం.

విమల:—తెలియకేమి ఆమెవ్రాసి పంపిన ఉత్తరం చేరలేదూ.

బాబు:—చేరలేదు. విమలా! ప్రేయసి విరహతాపం జెంది చనిపోయిందేమో అని పొడుచుకుచచ్చాడు.

విమల:—అయ్యో పాపం!

బాబు:—కొంతసేపటికి ఆమె లేచింది. అటుచూసేసరికి ప్రియుని రక్తప్రవాహం కనబడుతుంది. జరిగిన అవాంతరానికి వలపోస్తూ తానుకూడా ఆ కాయంమీదపడి ప్రాణాలు వదలింది.

విమల:—ఇంకెవరూ లేరూ, అక్కడ.

బాబు:—ఇదిజరిగిన కొంత సేపటికి పుష్పతండ్రి మోహనుతండ్రి అక్కడకు వచ్చారు. వాళ్లిద్దరి ప్రేమానురాగానికి ఆశ్చర్యపడ్డారు. వెంటనే అమ్మాయితండ్రి, మోహనుతండ్రి కౌగలించుకొన్నారు. వాళ్ల చావుకు వీళ్లిద్దరే అని దుఃఖపడ్డారు. ఆ రోజు లగాయితు ఆ రెండు కుటుంబాలు అన్యోన్యంగా ప్రవర్తించినవి.

విమల:—కాని కవి ప్రేమస్వరూపులను ఈ విధంగా చంపడం బాగుండలేదు బాబు. నీవే చూశావు. Tragedy చేయకుండా వాళ్లిద్దరిని బ్రతికించి ఆ రెండు కుటుంబాలకు సఖ్యత కుదిరిస్తే బాగుండేది.

బాబు:—అవును. విమలా! నీవు చెప్పింది సత్యం. ప్రేమికుల చంపడంలో ప్రపంచానికి Constructive Idea లేకుండా Destruction గా బోధ చేస్తున్నాడు కవి. Creative గా ప్రపంచానికి బోధపరచని రచనలు అడవిగాచిన వెన్నెలవలె వృథా అయిపోయి వికారంగా పరిణమిస్తాయి.

విమల:—నీ మాటకు నే నంగీకరిస్తాను.

బాబు:—ఈ విషమ పరిస్థితులే నీ జీవితంలో వస్తే నీవా పుష్పలాగా చేయగలుగుతావా. విమలా.

విమల:—దానికేమి తప్పక చేస్తాను. పవిత్రమైన జీవితం, ప్రేమించిన ప్రియునికంటె ప్రాణాలెక్కువా.

బాబు:—అవును విమలా. నీలో ఆశక్తి ఉంది. నీ ప్రియుని కోసం, నీ ఆత్మగౌరవంకోసం నీ దేశంకొరకు నీ వెంతైనా త్యాగం చేస్తావని నాకు గట్టి నమ్మకం.

[బీదవాడు పాటపాడుకుంటూ వస్తాడు.]

పాట

ఆకలిమంటల బాధమాన్పెడు సదయులు లేరా
లోకము గుండెయ రాయా ॥ఆకలి॥
మానవజాతి మనుషులమేగా,
నూ మొరాలకించే వారే లేరా ॥ఆకలి॥

పద్యము.

"దివ్యప్రతాపుడు తిక్కన ఖడ్గము............
.......................
............మీనాడు బడయగలమె"

"పండిసల్లి"

బీదవాడు:—(విమల, బాబునుచూసి) బాబు మీరు డబ్బూమయుల్లా గున్నారు. ఈ ముష్టి చెంబులో కాని డబ్బు వేయించమూ, పుణ్యముంటుంది. నేను నాభార్య, నాపిల్లలు మూడు రోజులునుంచి పస్తు. ఆకలిమంటలతో మలమలమాడిపోతూ వుంటే కాని డబ్బిచ్చేవారొక్కరు లేరు ఈపాడు ప్రపంచంలో. నా అదృష్టంకొద్దీ మీరు కనబడ్డారు. ఆనందం కలుగుతూవుంది. కష్టాలేమి జ్ఞప్తికి రావడంలేదు. పుణ్య దంపతుల్లాగున్నారు.

బాబు:—విమలా: విన్నావా, వీళ్ల రోదనధ్వనులు. ఆకలిమంటలు. దేశదారిద్రాన్ని బాపడం ఎలా? (ఒకరూపాయ తీసి ముష్టి చెంబులో వేస్తాడు.)

విమల:—(బిచ్చగానితాకి) నీ పేరేమిటి?

బీదవాడు:—ప్రకాశం.

విమల:—మంచిపేరు. పాపం ఆకలిమంటతో చచ్చిపోతున్నావు. మా యింటికిరా. మా నాన్నకుచెప్పి పొలం మేస్త్రీగా కుద

రుస్తాను. ప్రకాశం నీవు అనుభవశాలివిగా ఉన్నావు. ఆనందం అన్నావే దాన్ని గురించి, అంటే నీవు కనుగొన్న ఆనందాన్ని గురించి అన్నమాట. ఆనంద జీవితంలో ఏ విధంగా సమకూడుతుందో నీకు కలిగిన అనుభావాలనుబట్టి చెప్పు. జీవిత సాగరంలో ఏర్పరుపబడిన మహోత్కృష్టమైన అనుభావాలను జీర్ణించుకొని, భావగర్భితంగా నిమిడియున్న నీ హృదయం, నీ కళ్లలోను నీముఖంలోను తాండవించి ఉంది. చెప్పు నీ అనుభావాలను (ప్రకాశమనుకొంటూ (పూజకు తీసుకొని వెళ్లుతున్న పండ్లు ఇస్తుంది. బీదవాడు ఆ పండ్లను తిని, దీర్ఘోపన్యాస (ప్రారంభిస్తాడు.)

బీదవాడు:— జీవితాన్ని ఆనందమయం చేయదలచినకే వ్యక్తి సర్వవిధముల పాటుపడుతాడు. బాల్యావస్థనుండి వ్యక్తి తాను జీవిత సాగరాన్ని స్వయంగా చరపడం వచ్చేవరకు అతని జీవితం బ్రహ్మానందంగా తెలియకుండగనే అమాయకంగా జారిపోతుంది. కుటుంబ వ్యవహారాలనుబట్టి వ్యక్తి జీవితంలో ఆ రోజులు కూడా సుఖంగా జరుగకపోవడం నేనెరుగుదును. అనారోగ్యం కూడా ఒక కారణమై ఉండవచ్చు. అతని కార్యదీక్ష, ఉత్సాహము, పరిసర విషయాల సహవాసం, సూక్ష్మబుద్ధి, విజ్ఞానం కొరతే కావచ్చు. కాని విశాల దృష్టిలో పరిశీలిస్తే నేను మొదటగా చెప్పిన కాలంలో వ్యక్తి తన జీవితాన్ని ఆనందంగా నడపడమే కాకుండా భావిజీవితసాగరాన్ని ఆనందదాయకంగా చేసుకోవడము, పరిస్థితులనే విధంగా నెదుర్కొని మనస్సున ఖేదము లేకుండా తప్పించుకుంటూ నిశ్చల శాంతిని బడయుటకు కావలసిన అవకాశములు గలవు. అంతేకాకుండా గృహము, దాని వాతావరణము విజ్ఞానసాంప్రదాయకంగా ఉండాలి. తల్లిదండ్రులు ముఖ్యంగా విద్యావంతులై దుఃఖాన్ని దిగమ్రింగుచు ఆనందమనే ఆశాజ్యోతిని విడవకుండా దాని కనుకూలమైన వాతా

వరణాన్ని ఏర్పరచుకోవాలి. చుట్టూ బంధువులు, మిత్రులు కూడా ఈ పంథాలోనే పోవాలి. అప్పుడు ఆ పల్లెకాని, పట్టణముకాని ప్రతివ్యక్తి జీవితానికి అడ్డంకు లేకుండా సర్వాంగ సుందరంగా విరాజిల్లుతుంది. తలిదండ్రులు తమ పుత్రికల విషయంలో కూడా ఇంతే! ఆమెను గృహిణిగా సర్వాంగ చేయుటకూ, భర్తల కనుకూలంగా ఆనందాన్ని సమకూర్చును. భర్తను విజ్ఞానవంతునిగా ఒనర్చుటకు సర్వ విధముల ప్రయత్నించుచుండవలెను. అందుకనే మన పూర్వులు స్త్రీ "త్యాగానికే" సృష్టింపబడ్డదన్నారు. విద్యావంతులై విజ్ఞానంతో వినాళ్లు దంపతుల పరివర్తనంలో కాని. వారి దాంపత్యసుఖంలో కాని, దుఃఖాలు ఉంటాయంటే నేను నమ్మను. ఆ దాంపత్యము, ఆనందదాయకమైనవి వంటియు, ఆదర్శ ప్రాయకమైనవి వంటియు అయి ఉండునని చెప్పడానికి సందేహించను. నిశ్చలమైన మనస్సు లేకుండా విరివి విరామం లేకుండా జీవితాన్ని నడిపడమే దుఃఖ ముయము. వీటిని జయించినప్పుడు వ్యక్తి ఎంత పెద్ద కార్యమును తలపెట్టినను శ్రమ లేకుండా నెరవేర్చగలడు. ఆ కార్యమున తాను ఆనందమును పొందగలడు.

బాబు:—నీ ఉపన్యాసం అంధకారాన్ని తొలగించి జ్ఞానోదయం సమకూర్చింది. నీ మాటల్లో ఎంతైనా సత్యమున్నది. భారతమాతను పూజించి వెళ్లుదాం పదండి.

ప్రార్థన.

"విప్రులోర్వీతుల..................

...........నమోవాకముల్"

"కొండిపల్లి"

బాబు:—విమలా సెలవు. కొండదగ్గర మరల కలుసుకుంటానులే.

[విమల గంపఎత్తుకొని బాబువంక అలా చూస్తూవుంటుంది.]

(తెర వాలును.)

## 3—వ రంగం.

[ప్లీడరుగారి యిల్లు. పడకకుర్చీలో పడుకొని పేపరు చదువుతూ ఉంటాడు.]

ప్లీడరు:—కోమలి : కోమలి.

[ప్లీడరుగారి భార్య కోమలి వస్తుంది.]

ప్లీడరు:—(లేచి) ఇంకా కాఫీకాలా.

భార్య:—లేదు.

ప్లీడరు:—ఏంజేస్తున్నావు, ఇందాకణ్ణించి.

భార్య:—పొయ్యి మండలేదు.

ప్లీడరు:—ఎందుకు మండలేదు.

భార్య:—కిరసనాయిలు లేదండి.

ప్లీడరు:—కిరసనాయిలకు రేషన్ వచ్చిందని తెలియదు. దేశాలు పోయే గొప్పయుద్ధం జరుగుతుంటే నీకు పొయ్యిలోకి కిరసనాయిలు కావలసి వచ్చిందా. Dam the females. పొయ్యి దగ్గర కూర్చొని గొట్టంబెట్టి ఊదు. (అని కొట్టి పంపిస్తాడు.)

భార్య:—పాపిష్టియుద్ధం సంసారానికి అన్నీ తిప్పలేవచ్చి పడ్డాయి.

(ప్లీడరుగారి భార్య వెళ్లును.)

[రంగారావు ప్రవేశిస్తాడు. ప్లీడరు రంగారావుని చూచి.]

ప్లీడరు:—ఏమండి రంగారావుగారు: ఇవాళ్ల ఇటు దయచేసారు. కూర్చోండి. విశేషాలేమిటి.

రంగా:—ఏమిలేవు : ఒక చిన్నపని వెంటబెట్టుకొని వచ్చాను. మీ సలహా సహాయం కోసం.

ప్లీడరు:—అవును. మీరు వూరికే రారని నాకు తెలుసు. రాఘవరావుగారి పాలంగట్టు మీరు తెగ కొట్టించారని, దాంతో మీకు తగాదా వచ్చిందని విన్నాను. కలెక్టరు మనవాడే లెండి. ఆ విషయ మేమైనానా.

రంగా:—అవును : అదే, మీరెట్లు తెలుసుకో గలిగారు.

ప్లీడరు:—నిన్న కలెక్టరు గారితో నాట్లాడానికి వెళ్లాను. మీ విషయమే చెప్పారు.

రంగా:—అదాలండీ. మీరు సమర్థులనే మీవద్ద కొచ్చాను.

ప్లీడరు:—మాకు తెలియని విషయాలు, చేతగాని పనులు ఉంటా యండి. వేనకు వేలు డబ్బుపోసి ఎన్నో కష్టాలుపడి సంపాదించిన పట్టాకదండి మాది. విశేషమేమిటో చెప్పండి.

రంగా:—(ఉత్తరము జేబునుండి తీసి) ఈ ఉత్తరము చదవండి.

[ప్లీడరు ఉత్తరము తీసుకొని చదువబోవును. నుగ్రవాడు కాఫీతీసుకొని పాటపాడుకుంటూ వస్తాడు.]

పాట :

కాఫీనీళ్లకు, గంజిమెతుకులకు డబ్బే ముఖ్యమేగాదా
జగతిలో డబ్బేముఖ్యమేగాదా.
నాటకరంగా ప్రేమతరంగా
విజ్ఞాల రూపవికాశా డబ్బేగా ॥కాఫీ॥
ప్రపంచమందున్న, రాజాధి రాజులందున్న
మేడమిద్దెలందున్న, సానిసంపదలందున్న
తేజోవిలాసవీవే నిన్నున్ నుతింపగ నేనెంతవాడన్
దయాశాలివీవె, ప్రకాశాలివీవె,
విలోకింపజాలన్ నుతింపంగజాలన్
లక్ష్మి నీకిదెవందనములు, మాతా నీకిదె నమస్కృతులు.

[తెచ్చిన కాఫీ ప్లీడరుకు యిస్తాడు. ప్లీడరు కాఫీ త్రాగి ఉత్తరము చదువుతాడు.]

చిరిపురిగ్రామ మునసబుగారికి,

మీ పల్లెలో రంగారావుగారికి రాఘవరావుగారికి
పొలంగట్టు విషయంలో వాదప్రతివాదములు జరిగిన

వనిన్నీ, రంగారావుగారు రాఘవరావుగారి చెంప మీద దెబ్బ కొట్టారని, దాన్ని పరిష్కరించుటకు కలెక్టరుగారు స్వయంగా వచ్చి తీర్మానం చెప్పాల్సి ఉంటుందని Revenue Inspector గారి Report వల్ల తేలింది. కావున వచ్చే నెల 15 తారీఖున వారు మీ గ్రామమునకు విచ్చేయుచున్నారు. పిరియాదు లిద్దరిని ఆ రోజుకు హాజరు చేయవలసి ఉంటుంది.

కుమారప్ప,
శిరస్తారు.

ప్లీడరు:—సరే బాగానే వుంది. మీకువచ్చిన తగదా ఏమిటండీ?

రంగా:—గట్టేమో తెగకొట్టించానండి. చెంపదెబ్బ కొట్టినమాట వాస్తవం. ఎలాగైతే ఈ విషయంలో నాకు అవమానం కాకుండా ఆగట్టు నాదని మీరు రుజువుచేయాలి. అంతే.

ప్లీడరు:—ఓస్సి: ఇంతేనా. అదెంతపని. వెయ్యిరూపాయలు అవుతుంది.

రంగా:—వెయ్యే.

ప్లీడరు:—వెయ్యి మీకొక లెక్కండి. పెద్దకాపులు మీరు, డబ్బు పోయినా గౌరవం దక్కుదండీ! ఈసారి రాఘవరావు పూర్తిగా మీకు లొంగిపోతాడు. మొదటగా కలెక్టరుగారికి టీపార్టి చేయాల్సిఉంటుంది. దానికిగాను ఐదువందల రూపాయలు అవుతవి.

రంగా:—సరే అట్లైకానివ్వండి (ఐదువందల రూపాయల కవరు తీసి యిస్తాడు.)

ప్లీడరు:—(లెక్క చూచి) ఐదువందలే ఇచ్చారే.

రంగా:—మిగతా రేపు పంపుతాను. మీరు గట్టిగా పనిచేయాలి సుమాండి.

ప్లీడరు:—అధైర్య పడకండి! సాధ్యమైనమట్టుకు కలెక్టరుగారు మీ పల్లెకు రాకుండానే చేస్తాను. అధవా! వచ్చారా! గట్టు తెగకొట్టించలేదని మాత్రం మీరు చెప్పండి. తరువాత నాప్రజ్ఞ. తెలిసిందా. ?

రంగా:—కూలీలు మనమాట వింటారా.

ప్లీడరు:—ఎంతమంది ఉన్నారు.

రంగా:—నలుగురు.

ప్లీడరు:—తలా ఐదురూపాయలు పారెయ్యండి. మొత్తం 20 రూపాయలేగా. వాళ్లు వాళ్లకేమి తెలియదని చెప్తారు.

రంగా:—సెలవు: (రంగారావు పోబోవును)

(తెరవాలును)

## 4—వ రంగం

[గొల్లపిల్లలందరు గొఱ్ఱెలను, పశువులను తోలుకొని పాటలు పద్యాలు పాడుకుంటూ కొండప్రాంతాల్లోకి పోతూవుంటారు. పశువులను కొండబీడులలో వదలిపెట్టి, ఆ ప్రదేశానికి చేరువలోనున్న పంటకాలువలో ఈదటానికి పోతారు. మధ్యానం కొండఛాయలో కూర్చొని చద్దిమూటలు సేవిస్తూవుంటారు.]

ఒకడు:—గోంగూర పెట్టరా! (భోంచేస్తూ) ఇవాళ్ల నాగడునాటకం వేద్దాం.

రెండవవాడు:—రాజువేషం ఎవరు వేస్తారు.

మూడవవాడు:—నేను వేస్తాను.

రెండవవాడు:—రాణి.

మూడవవాడు:—మన గుల్లడు వేస్తాడు.

రెండవవాడు:—అయితే నాగుణ్ని నేనువేస్తా?

ఒకడు:—నాటకం మొదలెడ్దాము లెండి.

[లోపలికి వెళ్లి చేతులు కడుకొనివచ్చి (లేక) సెలయేటి కాలువలో చేతులు కడుగుక్కోటానికి పోతారు. మూడవవాడు ఎత్తురాతిమీద కూర్చొంటాడు. గుల్లడు అతనిప్రక్కనే తలవొంచుకొని నిలబడ్తాడు. రెండవవాడు రాజుకు ఎదురుగా నిలబడ్తాడు. ఇద్దరు గొల్లపిల్లలు రాధాకృష్ణుల నాట్యం చేస్తారు. బాబు అక్కడకువచ్చి చాటుగా వీళ్ల ఆటలను పరిశీలిస్తూ వుంటాడు.]

రెండవవాడు:—ఓ ప్రభూ! ఆకలి మంటతో మలమల మాడిపోతున్నాను. కరుణాసముద్రులు, ఆనందమయ స్వరూపులు, అఖండ విఖ్యాతిపొందిన మీరు, ధర్మము, న్యాయము స్థాపింప నడుముకట్టిన మీరు, స్వేచ్ఛాజీవులుగా మీ ప్రజలను అనుభవింప గడంగిన మీరు, ఈ అనాధను ఈ నిరుత్సాహపరుణ్ని కనికరించి ఒకదారికి తియ్యండి. స్వార్థుల కట్టుబాట్లలో క్రుంగిపోతున్నాను. ఈ బీదవాణ్ని కనికరించరూ!

[ఆ మాటలకు రాజు ఏడుస్తూ కన్నీరు కారుస్తాడు.]

రాజు:—(రాణివంక చూచి) రాణీ: చూచావా. వీళ్లు ఏడుస్తూంటె నా గుండె తరుక్కుపోతుంది. కాని ఏమి చెయ్యడం. ఎగర్తించి ఏమైనా చేసాగా నా పదవి కాస్త ఊడుతుంది. వీళ్లనెలా ఓదార్చడం?

రాణి:—ఏమండీ: ఇలా అంటారు. వాళ్లు మన భారతపుత్రులు కారండీ. వాళ్లకష్టాలు తీర్చడానికంటె మనకు కావల్సిందేమిటండీ. వాళ్ల ఆనందమే మన ఆనందం. నడుముకట్టి ముందుకు పదండి. మొన్న ఆటకాయితనంగా వేసిన మీ బాణానికి వాడి ప్రాణాలు గురైయైతే విశాల హృదయం వాళ్లకు ఉండబట్టె మరల మిమ్ములను ఆశ్రయిస్తున్నారు. కార్యాంతరము మన ఆనందం మనసౌఖ్యం చూచుకోవచ్చు. ఈ సంపదలు శాశ్వతములు కావు. పాపానికి గురికావల్సిందే. మీరు గడించిన కీర్తే ఈ ప్రపంచంలో నిలిచేది. స్వార్థంతో కూడిన ఈ గౌరవం, పలుకుబడీ, ప్రశంసనీయములు కావు.

మన సాంప్రదాయము, విజ్ఞానం, పూర్వుల కీర్తిని నిలబెట్ట డానికైనా ముందంజ వేయండి.

రాజు:—సెబాష్. రాణీ. నీవు నాకు నచ్చావు. బాగాచెప్పావు. బలే సంతోషమైంది. (రెండవవాని వంకచూచి) అయితే నీపేరేమిటోయి.

రెండవ:—నాగడు లేక జున్నా అంటారు.

రాజు:—(భుజంమీద చేయ్యివేసి) సేవకా: ఈపత్రిక కోశాధ్యక్షుని వద్దకు కొనిపోయి, ఈ జున్నకు మూడువేల రూపాయ లిప్పించు. మన పూర్వులపేరు ప్రతిష్టలను, స్వేచ్ఛా జీవితంలో ఉండే అమృతాన్ని ప్రచారం చేస్తాడు.

బాబు:—(ముందుకువచ్చి) రాణిగారు విమల వచ్చిందండీ ?

[అందరు నవ్వుతారు. ఆట మానివేసి బాబువెంట పడుతారు.]

ఒకడు:—ఇంకా రాలేదు బాబు: కారణమేమిటో తెలియదు.

[బాబు దీర్ఘంగా ఆలోచిస్తూ వుంటాడు.]

రెండవవాడు:—(మరికొందరు గొల్లపిల్లలు బాబును ఎంకి పాటలు పాడమని నిర్బంధిస్తారు.) బాబు ఎంకిపాటలు పాడి చాల రోజులైంది.

అందరు:—ఇవాళ్ల తప్పక పాడాల్సిందే. మొదలిపెట్టం.

[బాబు ఎంకిపాట పాడుతాడు]

ఎంకిపాట :

"ఎంకివంటిపిల్ల ....................

కలాసా గుంటాది నా ఎంకి
కులుకుసూపెట్టాది నా ఎంకి"

బాబు:—కొండపైకి వెళ్దాం పదండి. విమల వస్తావుందేమో చూద్దాం. (తెర వాలును)

## 5—వ రంగం

[రాఘవవుని యిల్లు. గోడలందు బొమ్మలు అమర్చబడ్డాయి. బాబు బొమ్మలనుచూచి]

పాట :

భారతమాతా, భాగ్యోపేత, భావనగంపలమాతా। ॥జయ॥
కొండలూ, అరణ్యాలు, సెలయేటి కాలువలు,
నదీప్రవాహములు, గొల్లలు కేర్పడిన ప్రదేశాలగామాతా ॥భా॥
రాధా!　　కృష్ణా!
కృష్ణా!　　రాధా!
రాధాకృష్ణా
గన్నమాతా భావనగంపలమాతా　　॥జయ భారత॥
వెన్నదొంగ, చిలిపిచేష్టలు, గొల్లభామల
జలక్రీడలు సలిపిన కృష్ణుని
మాతా భావనగంపల మాతా　　॥భారతమాతా॥

[ఆ మరునాడు బాబు విమల యింటికి బయలుదేరుతాడు. విమల కొండకు రాని కారణం తెలుసుకోవడం అతనికి తీరని బాధగా వుంది. బాబు తండ్రి రాఘవుడు ఎదురువచ్చి!]

రాఘు:—బాబు ఏమి ఆ హడావిడి ఎక్కడికి ప్రయాణం.

బాబు:—విమల యింటికి.

రాఘు:—రంగారావుని కూతురు కదుటోయి.

బాబు:—అవును. అయితే ఏమినాన్నా. విమల జీవితాన్ని ఆనందమయం జేయడానికి అవతరించిన అమృత స్వరూపిణి నాన్నా. ఊరి వెలుపల ఆ ప్రదేశము లేదూ నాన్నా. ఆ కొండ ప్రాంతాలు, ఆ పచ్చికబీళ్లు, ఆ సెలయేటి కాలువలు. అబ్బా! ఏమి చెప్పనునాన్నా. తీరులుగట్టిన దారిగుండా పోతూ

ప్రకృతిశోభలను తిలకిస్తూ, ఆ సెలయేటి రేయిగుండా విమల నేను కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ అక్కడక్కడ ఆ తియ్యని జానపండ్లు తింటూ నడచిపోతూ వుంటే ఏం చెప్పను నాన్న: అలసటవస్తే కొండలోయలో చల్లని నీడలో కూర్చొని పశ్చిమవాయువు తనపిల్ల గాడ్పులను వీచే సమయంలో విమల పాడుతుంది నాన్న. ఆ మెగానం మృతంలో నా శరీరాన్ని మరచిపోతాను. ఆనందాలన్ని ఆ చోటనే మూర్తీభవించినట్లుంటుంది నాన్న. (అంటూ బాబు వెళ్తాడు. రాఘవుడు నిర్ఘాంతపోయి నిలబడ్తాడు. రంగారావు ఊరుకోడని తెలుసు. బాబు వెంట వెళ్లాలని నిశ్చయించు కొంటాడు.)

రాఘు:—పాపం: పిడి అమాయక ఆనందం. రంగారావు పిట్టని మావాడివల్లో పడనిస్తాడా. వెంటవెళ్లి జరిగేనాటకం చూస్తూ ఉంటాను.

[రాఘవుని భార్య మంగమ్మ ప్రవేశం]

మంగ:—ఏమండీ! ఆలోచిస్తున్నారు.

రాఘు:—ఏమి లేదే: బాబు ఆనందాన్ని కనుగొన్నాడు.

మంగ:—ఆనందం మా బోనందం. రంగారావు ఎలాంటివాడో తెలిసిందేగా! యింకా ఆ పిల్లకోసం ప్రాకులాడటమెందుకు. వాడిపిచ్చి మీకూడా పట్టినట్లుంది. వెఱ్ఱి ఆలోచనలు. పిచ్చి నమ్మకాలు. చదువుకున్న వాడిబుద్ధి యిలాగే ఉంటుంది. అర్థంకాని ప్రేమ ప్రేయసి అంటాడు దాని అర్థం ఏమిటండి. ఇనాళ్లు కాపరం జేసాను నాకేం తెలియడంలేదు.

రాఘు:— తెలియదూ. ఇటు రా (చెంపనలిపి, చెంపమీద వ్రేలి పెట్టి తట్టుతాడు. సరసల్లాపాలాడి.) తెలిసిందా!

(తెగవాలును)

## Scene 2.

[ఆరోజు కలెక్టరుగారు వచ్చేదినం. రంగారావు సావిట్లో కూర్చొని ఆలోచిస్తూవుంటాడు. కవతగాడు వచ్చి.]

కవతగాడు:—నమస్కారమండి బాబయ్యా!

రంగా:—విశేషం ఏమైంది?

కవతగాడు:—కలెక్టరుగారు ఎప్పుడు వస్తారండి.

రంగా:—ఈ రోజు సాయంత్రం వస్తారని నిన్న మునసబుగారు యింటికివచ్చి చెప్పారురా! ఇంతకు కూలీలు ఏమంటున్నారు?

[రంగారావు లేచి పచారుచేస్తూ మాట్లాడుతూ వుంటాడు.]

కవ:—మీరు పంపిన 20 రూపాయలు తీసుకొన్నారండి.

రంగా:—తీసుకొని.

కవ:—చాలా సంతోషపడ్డారు.

రంగా:—అంతేనా! వెధవా. 20 రూపాయలు నాశనం జేసావన్న మాట.

కవ:—"రంగారావుగారు పలుకుబడిగల మనిషి, వారికి ఎదురుసాక్షం చెప్పామంటే మనము యీ పల్లెలో బ్రతకలేంరా! ఏదో తంత్రంజేసి మనల్ని పల్లెనుండి వెళ్ళగొడ్తారురా!" అని అంటూన్నారండి.

రంగా:—సెబాష్. మంచివార్త చెప్పావోయి. అలావుండాలి. (మీసం త్రిప్పుకుంటూ) ఈ రోజుతో రాఘవుని పలుకుబడి అడుగంటుతుంది. పల్లెకంతా నేనొక్కణ్ణే ఆధారమవుతాను. అప్పుడు అందరూ నాకు లొంగిపోతారు.

కవ:—చిత్తం. బాబయ్యా!

[బాబువస్తాడు.]

బాబు:—విమలా, విమలా,

రంగా:—ఎవరక్కడ?

బాబు:—(ముందుకువచ్చి) రంగారావుగారు: విమల ఇంట్లోలేదండి.

రంగా:—ఓరి పిడుగా! ఎందుకొచ్చావు? సాయంత్రం కలెక్టరు గారు వస్తాడని తెలియదు.

బాబు:—తెలుసును. రానివ్వండి. నాన్న మీరు హాజరవుతారు. నాకేం. విమల నేను కొండకెళ్తాం.

రంగా:—మీనాన్న నేను కొట్లాడుకుంటున్నామని తెలియదూ.

బాబు:—తెలుసు.

రంగా:—మరి నీవు నాయింటికెందు కొచ్చావు?

బాబు:—అదె చెప్పడానికె వచ్చాను. విమల కొండకువస్తానంది. పిలవడానికి వచ్చా!

రంగా:—(గట్టిగా) విమలా (అని కేకవేస్తాడు.)

[విమల వస్తుంది.]

రంగా:—బాబును రమ్మన్నావా కొండకెళ్లడానికి.

విమల:—అవును.

రంగా:—వీళ్లతో సంబంధ బాంధవ్యాలు మనకు వద్దుతల్లీ. నా మాట విను. వీళ్లనాన్న వట్టిమూఢుడని తెలియదు.

బాబు:—రంగారావుగారు. మాటలు తిన్నగా రానివ్వండి. యింటి కొచ్చానని యిష్టమొచ్చినట్లు వాక్కండి. జాగ్రత్త.

రంగా:—ఆట్టెవాక్కు. నీవెవరవు నా యింటికి రావడానికి: పో.

(బాబుపోతాడు.)

విమల:—వాళ్లేమి చేసారునాన్న. అలా కోప్పడతావు. ఆ గట్టు వాళ్లదేగా. బాబు విద్యనేర్చినవాడు. మంచి స్వభావం

గల అందమైనవాడునాన్నా. అతని మోహనరూపం చూస్తూవుంటే అపరిమిత ఆనందం కలుగుతుందినాన్న. ప్రేమస్వరూపుడు. అనుభవ ఆనందస్వరూపుడునాన్నా......

రంగా:—నోరుమూయి. నాకు చెప్పకుండా కొండకెళ్లు. ఏం చేస్తానో ? (అని లోనికిపోతాడు. విమల దుఃఖంతో బాబు వెళ్లినవైపు చూస్తూవుంటుంది. పాటపాడుతుంది.) (లేక)

పద్యం.

రెక్కలు రావు పిల్లలకు రేపటినుండియు మేతగానమిన్
బొక్కుచు గూటిలో నెగసి పోవగ నేరవు మున్నుతల్లి యీ
దిక్కున నుండివచ్చునని త్రిప్పని చూడ్కుల చూచిచూచి
నల్ దిక్కులు చూచుచున్న వతిదీనత నెట్లు భరింతువక్కటా !

"భాగవతము"

[బాబును వెంటాడుతుంది. రంగారావు మరల అక్కడకు వచ్చి]

రంగా:—విమలా విమలా (అని కేకలువేస్తాడు. కత్తిని చేతబట్టుకొని వెళ్తాడు.)

[తెరవాలును.]

Scene 3.

[బాబు పాటపాడుకుంటూ దుఃఖంతో వెడలివస్తాడు. కొండదారి పడుతాడు. ప్రపంచమంతా అంధకారమై నిరాకారంగా కనబడుతుంది. ఆ వేళ కొండలు అతని హృదయంలో కరగిపోతవి. సముద్రపు కెరటాలన్ని కన్నీటి ధారలవుతాయి. అతని హృదయం పూర్తిగా చలించి ఉంటుంది.]

పాట

ఆశా నిరాశా
మనసేమాయే మనమేమాయే
మనచదువూలే మాయే
మానవజాతికి ఉండే సహజము మాన్పగనీకేలా ?

Dam the Society. ఈ సంఘానికి, ఈ వ్యక్తులకు భయపడి నన్నాళ్లు బ్రతుకు ఇంతే. వజ్రములు, వస్త్రములు, పాడి పంటలు స్వపరిపాలనంతో తులతూగే భారతదేశం ఈ నాడు ఆకలి మంటలతో మలమలమాడిపోతూ నానాటికి అధోగతి పాలవుతూవుంటే ఆధారంలేని చిన్న విషయాన్ని అడ్డుపెట్టుకొని మూర్ఖంగా ప్రవర్తించే వ్యక్తులు, దేశద్రోహులు, స్వార్థులకట్టుబాట్లలో ఎన్నాళ్లు ఈ పవిత్రప్రేమ, అమాయక జీవితం రాణించేది ?

విమలా, విమలా

(పద్యములు పాడును.)

(కవికోకిల దువ్వూరి రామిరెడ్డిగారి పానశాలలోనివి.)

1. "కమ్మని..............పూల పోలికన్"

2. "చెలియరో..............జత్తురో"

[విమల వస్తుంది.]

విమల:—బాబూ.

బాబు:—విమలా. నీవేనా. వచ్చావా. మీ నాన్న నన్ను వెంటాడలా. వద్దు...వద్దు...రావద్దూ- విమలా...వెళ్లు...వెళ్లు విమలా. మీ నాన్న మంచివాడుకాడు. ఎంతటికైనా సాహసిస్తాడు ?

విమల:—ఈ చిన్న విషయానికేనా బాధపడడం.

పాట

భారతమాతా భావనగంపలమాతా, 'జయభారత'

జారిపోయిన హృదయాల లేవనెత్తగ నీవేగా ?

మాతా 'భారతమాతా భావన'

మహాశక్తి భూములు మా పల్లెప్రదేశాలే

కవుల హృదయాలకీ జీవిత దుఃఖపరంపరలు
నీటిబుగ్గ లేగా !

"భావనమాతా, భారత
మాతా, భావసంపల మాతా !"

బాబు:—కవికోకిల దువ్వూరి రామిరెడ్డిగారు వ్రాసిన పద్యాలు సత్యవంతములైనవి విమలా.

(పానశాలలోనివి)

1. కానలేము 2. 3.
ఇంకా ఏమి వ్రాసాడనుకున్నావు.
"అంతములేని..................
............ పరవారికి చోటొసంగుచున్."

లేక

ప్రపంచాన్ని అర్థంచేసుకోవడం చాలా కష్టతరమైనది విమలా ! అంతా మాయతో కూడి ఆశాజ్యోతులతో ఎండ మావులవలె శృంగారంగా కనబడుతుంది. తెరవెనుక యే మున్నది గ్రహించుట కష్టసాధ్యము. అమృతభావాలతో ఎన్నో ఆలోచనలతో యేదో గొప్ప భావాన్ని మనహృదయంతరాళమందు యిమిడి ఉంటుంది. కాని తెర ఎత్తిన వెంటనే ఆకథా వస్తువు దృష్టికగోచరమవుతుంది. యదార్థాన్ని గ్రహింపగలుగుతాము. అంతే ఈ ప్రపంచంకూడాను. అంతులేని ఈ మహాసత్రంలో వేనకువేలు బాటసారులువచ్చి విశ్రాంతి చేకూర్చుకోవాలని నిలబడతారు. పామరులు, భాగ్యవంతులు, రాజాధిరాజులు, మంత్రులు, కవులు, గాయకులు, ప్రేమికులు, ప్రజలు లక్షలాదిగా ఉద్భవించి, పలురకములైన తమ విచిత్ర నాటకరంగాలను విజృంభించి, కొద్ది రోజులు సుఖించి, ఇతరులకు తావు ఇచ్చి పోతూవుంటారు. శాశ్వతంలేని ఈ ప్రపంచం, ఈ జీవితానికి ఇంకా ఎందుకు ప్రయాసపడడం. జీవితం చాలించాలనిపిస్తుంది విమలా !

విమల.—పోని ఆ నాలుగు రోజులైనా సుఖంగా అనుభవించు. దుఃఖపడతా వెందుకు. నీ మనస్సు చెలించినట్లుంది బాబు. ఆ లోయలో కెళ్లుదాము రా. విశ్రాంతి కలుగుతుంది.

[ఒకచోట కూర్చొని ఉంటారు. Back ground Music]

పాట

పల్లె జీవితా భాగ్యాలన్నీ మనలోనున్న వేగా
ప్రకృతి శోభల శృంగారాలు,
ప్రేమతరంగ శృంఖాలాలు పల్లెల రుచియే రా!
నిర్మలశాంతి పొందేచోటులు పల్లెప్రదేశాలే
- పల్లెప్రదేశాలే, పల్లెప్రదేశాలే.

[బాబు చిరునవ్వుతో విమలా అని పిలుస్తాడు. ఇద్దరు ఆనందంగా ఐక్యమవుతారు.]

పాట. (డైలాగ్)

బాబు:—ప్రేమయే జీవనమాల ప్రియా ||ప్రేమయే॥
విమల:—ప్రేమయే శక్తి, ప్రేమయే రక్తి,
ప్రేమయే జీవనముక్తి ప్రియా!
ఇద్దరు:—ప్రేమలేకయే ప్రాపంచమేలా ప్రేమయే జీవనమాల ప్రియా
||ప్రేమయే జీవనమాల||

[ఇద్దరు శృంగారంగా నటించి మరల ఐక్యమవుతారు. రంగారావు ప్రవేశం.]

రంగా:—ఎక్కడి దానవే? యెవండితడు? ఓర్వలేను నీ వ్రక్కలు కాలిపోను, ఆరే! బాబు నిన్నిక నిల్వనీను నీ దిక్కెవడో కనుంగొను? వెధవానీకిదె కత్తిపోటు నా చక్కని పల్లెభారతిని పట్టదలంచు టొప్పదే?

నీ చదువులు చట్టబండలుకాను. ఇదేనా విజ్ఞానం. తల్లిదండ్రుల అదుపు ఆజ్ఞ లేకుండా, పెండ్లి పేరంటాలు లేకుండా, ప్రేయసి ప్రేమా అంటూ వూళ్లోళ్లపిల్లను ఎత్తుకు పోవడమేనా? (కత్తినెత్తి) చచ్చావురా. ఎవడు అడ్డొస్తాడో

చూస్తాను. ఈ రోజుతో నీ ప్రాణాలు సరి. పిల్లను చెరప టానికి పుట్టావు.

[బాబు చెవులు మూసుకొని తలవంచుకొని దుఃఖపడుతూ వుంటాడు.]

విమల:—(తండ్రికి అడ్డువచ్చి) నాన్న ఆగు. ఆగు నాన్న. నా మాట వినునాన్న. నీ కూతురు నిన్ను కాళ్లుబట్టి వేడుతుంది ఆ మాత్రం జాలి కరుణ కలుగదు నాన్న. హృదయంలేదూ. మానవజాతి మనది. వివేకము ఉండాలి మనకు. కనికరించవూ....వారిని వదిలేయి. వారిలో తప్పేమిలేదు. అంతా నాదే. నన్నుచంపునాన్న (అని ఎదురుకునిలబడుతుంది.)

రంగా:—ఛీ! అనుపు ఆజ్ఞ లేకుండా దొడ్డిదారిన లేచిపోవడమే. పో! అవతలకు (అని విమలను నెట్టుతాడు.)

[రాఘవుడు వస్తాడు. దృశ్యాన్నిచూసి]

రాఘు:—అరేయి రంగా! ఎవరులేకుండా చూసి ఇదాచేయడం. పిరికిపంద. కత్తిదించు......దించవూ.

[అని తెచ్చిన గొడ్డలిని ఎత్తుతాడు.]

బాబు:—(దీనంగా) నాన్న. మీ పోట్లాటకంటె మా ప్రేమ ఎక్కువైందా? నేనుపోతాను. మీ యిద్దరిక్షేమమే మా క్షేమం. మనపల్లె జీవితక్షేమం. గొడ్డలి దించునాన్న. రంగారావు గారు నాతప్పు క్షమించండి. పల్లె రక్తప్రవాహంకాకుండా చూడండి. మన పశువులు, మన గొడ్లు, మన రైతులు మనపల్లె సంపదంతా ఈ రోజువరకు శాంతంగానే నడిచింది. మనఆస్తులు కోర్టుకు, ప్లీడర్లకు ఆహుతికాకుండా నిలిచినవి. మన కుటుంబాలు, మన ఆడవారినిచూచియైనా పోట్లాట మానండి. గడ్డివాములన్ని తగలబడి పశువుల రక్తధారాలు ప్రవహిస్తూవుంటవి. (విమలవంకచూచి)విమలా క్షమించవూ.

నన్ను మరచిపో. మన చదువులు, మన తెలివితేటలు ఒక చిన్న పల్లెను శృంగారం చేయలేకపోయినవి. మానవజాతి స్వభావం తెలుసుకోకుండా అనవసర ప్రేమానురాగాలు, కార్యానికి ముందు కాలిడటం ప్రమాదకరం అని తేలింది. నన్ను మరచిపో విమలా (అని బాబు వెళ్లబోతాడు. విమల ఆమెలో ఏదో విద్యుశ్శక్తి ప్రవహించింది. వెంటనే ఒక నిర్ణయానికి వచ్చింది. తండ్రిచేతిలో కత్తినిలాగి)

లేక

(కొండ పై భాగానికి వెళ్లుతుంది. కొండకొననుండి క్రింద లోయలోకి దూకబోతుంది. లోయ పెద్ద అగాధం. వెను ళ్లతోనిండి ప్రక్కనున్న నదిప్రవాహమునకు అంటిఉంటుంది?)

విమల:—నాన్న. పవిత్రహృదయాల నేడిపిస్తున్నావు. మేము చేసిన పాపం ఏమిటి. ఆధారంలేని పోట్లాటకు అమాయక జీవితాలు గురికావలసిందేనా! ఇదేనా న్యాయం, ఇదేనా ధర్మం, ఇదేనా సత్యం. నాన్న. మీరిలా పోట్లాడుకుంటూవుంటే ఈ పల్లెకేకాదు ఈ ప్రపంచానికంతా శాంతి ఉండదు. మన రైతుల కష్టాలు గట్టెక్కడం అసంభవమవుతుంది. సార్థుల మనిపించుకుంటాము. (బాబు అని కేకవేస్తుంది. విమల అని మరల బాబు కేకవేస్తాడు.) నా ప్రియుడు, పవిత్రమైన ప్రేమ, నిష్కల్మశమైన హృదయం, విద్యావంతుడు, బుద్ధిశాలి, నా నాథుడు నాకు కాకుండాపోతూవుంటే నాకి ప్రాణాలెందుకు. (అని కత్తినెత్తి పొడుచుకోబోవును.)

రంగా:—(నిర్ఘాంతపోయి) విమలా, విమలా....ఆగు విమలా! ఎంత సాహసించావు. నీ ప్రేమకు అడ్డురానులే. నీ యిష్టం. నీమాటకు అడ్డులేదు విమలా. (విమల చిరునవ్వు అభినయిస్తుంది) అవును. నీ మాటలు సత్యం విమలా. మాతత్వంలో

అంతా మాయగా చేసాను. కూతురువై జ్ఞానోదయం ప్రశా
దించావు. క్షమించు విమలా.

రాఘు:—బాబు మీ ప్రేమ పవిత్రమైంది.

రంగా:—బాబు, అంధకారాన్ని తొలగించి వెలుగు ప్రశాదించావు. మీ దంపతుల సానిధ్యంలో నాజీవితం సార్థకమైంది.

రాఘు:—అవును. పుట్టినింటికి మెట్టినింటికి పేరు తెచ్చిపెట్టిన పుణ్యు రాలు విమలా. ఇది నాకు సుదినము. నా మనస్సుకు సమస్తవిధాలా శాంతి చేకూరింది.

రంగా:—రాఘువా
రాఘు:—రంగా
} అంటూ దంపతుల నిద్దరి చేతులను కలుపుతారు.

మునసబు ప్రవేశించి : (చేతిలో రెండు దండలుండును.) మిమ్ములను కలెక్టరుగారు రమ్మంటున్నారు. (రంగా. రాఘువుడు నవ్వి.)

రంగా:—మునసబుగారు, కలెక్టరుగారు వచ్చారా? కోర్టు వ్యవహారాలు మాకు వద్దని చెప్పండి. మే మిద్దరము ప్రాణమిత్రులయ్యాము.

[రంగారావు, రాఘవుడు చిరునవ్వుతో ఒకరినొకరు చూచుకుంటారు. కలెక్టరు, Revenue Inspector, శీతగాడు ప్రవేశిస్తారు.]

కలెక్టరు:—రంగారావుగారు మీ మాటలు వింటున్నాను. చాలా సంతోషం. మీ రిద్దరు ఐక్యంకులయ్యారంటే సంతోషము కాక ఇంకేముంది. బ్రహ్మానందం కలిగింది. మీ పల్లెకు, మీ రైతులకు అమోఘమైన నూతనశోభను తెచ్చిపెట్టారు. మీ రందరూ అన్యోన్యంగా ఉంటే మాబోంట్లకు పనే ఉండదుగా! (నవ్వును)

రాఘు:—కలెక్టరుగారు, పెండ్లి నాలుగురోజులు ఇక్కడే ఉండి మీ దీవనలు దంపతులకు ప్రసాదించండి. మమ్ములను మారైతు

లను, మా పల్లెను ఆనందపరవశుల గావించండి. మా ప్రార్థన మీరు అంగీకరిస్తారనుకుంటాను.

కలెక్టరు:—సరే. (మునసబు కలెక్టరుగారికి దండలిస్తాడు. ఆ దండలను కలెక్టరు దంపతులకిచ్చి వాళ్ల మెళ్లల్లో వేయిస్తాడు.)

బాక్‌గ్రవుండ్ మ్యూజిక్

జయ జయ మంగళ మంగళమే
పరమాత్మా పరంధామ తరింపగ
నీ సాన్నిధ్యమే పరమపదమైన జీవితాశా!

---

(ఈ క్రిందిపద్యములు నాటకరంగానికే మాత్రమే, సినిమాకు సమయోచితంగా ఉండవు. + 1st రంగము, 5th line)

రాఘవుడు:—

న్యాయసమార్జితంబగు ధనంబు పనస్వైన మదంబు పెద్ద
అన్యాయపుసొమ్ము కొంతయినను సుఖమీయనేగాక
పాయము జేయును నేలరాలెక్కుచు చీమగడించి భుజించు హాయిగా
రాయిడి నెల్ల వెన్నులు సారంగముజొచ్చి నశించు మిత్రుడా.

'నీతిచంద్రిక'

రంగారావు:—

నీవాచ్ఛాలతల్ యిక్కడ నక్కరలేదు, మరి
నీజ్ఞానసంపత్తు లినువారెవ్వరులేరు నాయిష్టము
నీవెవండు ననుమూరగ సొమ్ము నీకిచట తావులేదది
నా గట్టని చెప్పగ వాగెదవేల సొమ్ము మూఢచిత్తమా.

రాఘు: రంగా! నామాటలు నీకేమి లక్ష్యంగా లేవు. సరే. నీ వింతమూఢంగా ప్రవర్తిస్తావని నే నెన్నడూ అనుకోలేదు!

Printed at the Liberty Press, Madras